# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ – 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైద్రాబాదు – 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండి నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండి విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

| | | |
|---|---|---|
| నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి | | మేడా నరసింహులు శ్రేష్ఠి |
| అధ్యక్షులు | V.P.- A5 | ప్రధాన కార్యదర్శి |

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)**

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)**

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండీ మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18x15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12x10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు 116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ — యక్కలి బాలరత్నం

అధ్యక్షులు — మరియు కార్యవర్గ సభ్యులు — ప్రధాన కార్యదర్శి

## వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



**స్థాపితము**
1969



**సంపుటి**
28



**సంచిక**
11



**జూలై - 1997**



సంపాదకులు :
'సంఘోద్ధారక'
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలనీ,
కడప - 516 002.
ఫోన్స్ : 24911, 25025.


<u>సంపాదకీయం</u>

# నిత్యావసర వస్తువుల చట్టాన్ని పొడిగించవద్దు

"ఇప్పుడు అమలులో ఉన్న నిత్యావసర వస్తువుల చట్టాన్ని పొడిగించవద్దు" - అంటూ భారతదేశములోని కేంద్ర, రాష్ట్ర స్థాయిలలో పనిచేసే సర్వవర్తక సంఘాలూ భారత ప్రభుత్వానికి చేస్తున్న అభ్యర్థన చాలా సబబైనది తక్షణం మన్నించదగ్గది

నిత్యావసరవస్తువులచట్టములోని స్పెషల్ ప్రొవిజన్ ఆక్టు-1981 ప్రకారమూ - ఈ చట్టాన్ని ప్రతి మూడు సంవత్సరములకూ ఒక్కసారి పొడిగించవచ్చు. 1994లో తిరిగి మూడేండ్లు అమలులో ఉండునట్లుగా పొడిగించబడిన వ్యవధి ముగియు సందర్భాన్ని పురస్కరించుకొని చేసిన అభ్యర్థన కూడ ఇది

మూడేండ్ల గడువు ముగియు ప్రతి సందర్భములోనూ ఈ విధమైన అభ్యర్థనను భారతదేశములోని సర్వవర్తక సంఘాలూ చేస్తూనే ఉన్నవి. భారత ప్రభుత్వము వీటి అభ్యర్థనను మన్నించడములేదు. మన్నించక పోవడమే కాదు, వాటి అభ్యర్థనలోన్ని ఆంతర్యాన్నీ, వాస్తవికతనూ కనీసం పరిగణనకు తీసుకొని ఆలోచించలేదు. ఫలితంగా అనేకమంది వర్తకులు తాము చేయని తప్పుకు కారాగార వాసక్లేశాన్ని అనుభవిస్తున్నారు.

"వందమంది దోషులు శిక్షింపబడకున్నా తప్పులేదు. ఒక్క నిర్దోషి కూడ శిక్షింపబడరాదు". - అనేది న్యాయ సూత్రాలలో అతి ప్రధానమూ, అత్యంత ప్రాముఖ్యమూ కలిగినది. వర్తక సంఘాల న్యాయబద్ధమూ, సమంజసమూ అయిన అభ్యర్థనను మన్నించక భారత ప్రభుత్వము ఈ చట్టాన్ని పదే పదే పొడిగించుట ద్వారా పై న్యాయ సూత్రానికి బుద్ధి పూర్వకముగా భంగము కలిగించింది అనుట సాహసమనిపించదు.

జరిగిందేదో జరిగిపోయింది. ఈ దఫా - తిరిగి ఈ చట్టాన్ని పొడిగించుటను గురించి ఆలోచించునపుడు భారత ప్రభుత్వము వర్తక సంఘాలు చేస్తున్న ఈ అభ్యర్థనను హేతు పూర్వకంగా, ఆమూలాగ్రంగా పరిశీలించడము చాలా అవసరము. పదహారు, పదిహేడు సంవత్సరాలుగా

అనగా ఈ నిత్యావసరవస్తువులచట్టము అమలుకు వచ్చినప్పటి నుండీ, ఇంతవరకూ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల అధికారులు ఈ చట్టము క్రింద పెట్టిన కేసుల సంఖ్యనూ, ఆ కేసులలో నేరము ఋజువై శిక్షింపబడిన వారి సంఖ్యనూ విధిగా పరిగణన లోనికి తీసుకోవాలి రాష్ట్ర స్థాయిలోనేకాక జాతీయ స్థాయిలో కూడ ఈ చట్ట క్రింద అధికారులు పెట్టిన కేసుల్లో ఐదు శాతానికి మించి నేరము ఋజువై శిక్షలు విధించబడలేదు అని గణాంక వివరాలు చెప్తున్నాయి అంటే కేసులు బనాయించిన వర్తకులలో తొంబై ఐదు శాతము నిరపరాధులైన వర్తకులు చేయని తప్పుకు నిష్కారణంగా ఏండ్ల తరబడి కారాగారములలో నిర్బంధింపబడుచున్నారు -

ఈ చట్టాన్ని అమలు పరచు అధికారులకు - వర్తకుని నేరస్తునిగా భావించునపుడు - ఆ వర్తకుడు బుద్ధి పూర్వకంగా తప్పు చేశాడా? లేదా? అనునది నిర్ధారణ కాకముందే ఆతని చేతులకు సంకెళ్ళు తగిలించి వీధుల వెంబడి తీసుకొని పోవుటకు కూడ ఈచట్టములోని నిబంధనలు అవకాశాన్ని కల్పిస్తూన్నవి ఇంతేకాక, తనపై మోపబడిన నేరమును న్యాయస్థానము నిర్ధారించు వరకూ కారాగార వాసక్లేశాన్ని వర్తకుడు అనుభవిస్తున్నాడు

ఈ చట్టము క్రింద పెట్టిన కేసులలో న్యాయస్థానాలు తీర్పు ఇచ్చుటకు నెలలూ - సంవత్సరాలూ కూడ పట్టిన సందర్భాలే మిక్కిలి అట్టి వర్తకుని న్యాయస్థానము దోషిగా నిర్ణయించక పోయినా, అంతకాలమూ - ఆ వర్తకుడు జైల్లో ఉండక తప్పటలేదు అంటే నిరపరాధి నిష్కారణంగా శిక్షకాని శిక్షను అనుభవిస్తున్నాడు. ఇది న్యాయసూత్రాలకు సంపూర్ణంగా వ్యతిరేకమైనదని స్థూల దృష్టికి సహా గోచరించే అంశము

అమలు పరచు అధికారులకు, అంతులేని అధికారాలను కల్పిస్తున్న ఈ శాసనము, దురహంకారముతో అవినీతిని ఆశ్రయించాలనుకొనే కొద్దిమంది ప్రభుత్వాధి కారులకు జేబులు నింపేందుకు కూడ అవకాశాన్ని కల్పిస్తూంది

"నూరుమంది నేరస్థులకు శిక్షింపబడక పోయినా తప్పులేదు ఒక్క నిరపరాధి కూడ శిక్షింపబడరాదు" - అను ప్రధాన న్యాయ సూత్రానికి భంగము కలిగిస్తున్న ఈ అత్యవసర వస్తువుల చట్టాన్ని పొడిగించుట అభినందనీయము కాదు

ఈ చట్టమును అమలుపరచుటలో తమకు కలుగు కష్ట - నష్టాలను సహేతుకంగా భారత ప్రభుత్వము ముందుకు తీసుకొని వెళ్ళుటకు తగిన తక్షణ చర్యలను కేంద్ర, రాష్ట్రస్థాయిలో పనిచేసే వర్తక సంఘాలు చేపట్టాలి. అయితే అవి

ఇస్తాయి.

ఇటువంటి చర్యలను వర్తకసంఘాలు ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లోని వర్తక సంఘాలు గతములో ఒకటి - రెండుసార్లు తీసుకొన్నవి కానీ అవి ప్రభుత్వానికి సరియైన అవగాహనను కలిగించలేకపోగా నేల విడిచిన సాముగా మిగిలాయి. ఈ స్థితి చర్విత చర్వణము కాకుండా కూడ జాగ్రత్త పడాలి.

వైశ్యప్రబోధిని, జూలై 1997

# శ్రీ వాసవీ కన్యకా పురాణం

మూలం : వ్యాసప్రణీత స్కాంధ పురాణం

స్వేచ్ఛానువాదము : శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి (సంపాదకులు)

## నాల్గవ అధ్యాయము

భో వైశ్యసత్తమా సర్వశ్రేణు ధ్వమవధానతః
శ్రోతు కామా భవంతో ద్య యన్మాం పృచ్ఛత

ఓ వైశ్యోత్తములారా! మీరందరూ భక్తితో ఏ కథను వినగోరి నన్నడిగితిరో ఆ కథను సావధానముగా వినుడు.

కృత యుగము, త్రేతా యుగము, ద్వాపర యుగము, కలి యుగము - అని యుగములు నాలుగు. వీటిలో కృత యుగమునకు పదియారు లక్షల ఇరువది ఎనిమిది వేల సంవత్సరాలు - త్రేతా యుగమునకు పండ్రెండు లక్షల యెనబై ఎనిమిది వేల సంవత్సరాలు - ద్వాపర యుగానికి ఎనిమిది లక్షల అరువది నాలుగు వేల సంవత్సరాలు - కలి యుగమునకు పెద్దలైన మహర్షులు నాలుగు లక్షల ముప్పది రెండు వేల సంవత్సరములు - ప్రమాణముగా చెప్పిరి. ఈ నాలుగు యుగములూ కలిసి ఒక మహాయుగము. ఇట్టి మహాయుగములు డెబ్బది యొక్కటి కలసిన ఒక మన్వంత రమగు చున్నది. ఈ మన్వంతరమునే మహాత్ములు 'ఇంద్రకల్పము' అని చెప్పు దురు. పద్నాలుగు ఇంద్రకల్పములు బ్రహ్మ కు ఒక దినము. ఇట్టి పరిమితి గల నూరు సంవత్సరాలు బ్రహ్మ దేవుని ఆయుర్దాయ పరిమితి. నూరు బ్రహ్మకల్పములు గడచిన 'దీర్ఘాయువు' అను మునీంద్రునకు ఒక దినము. ఇరువది యేడు కోట్లు దీర్ఘాయువు మునీంద్రులు గడచిన 'రోమశాక్యుడు' అను ముని యొక్క ఒక్క రోమము ఊడిపోవును. ముప్పది కోట్ల రోమశాక్యమునులు గతించిన అష్టావక్ర మునియొక్క ఒక శల్యము జీర్ణించును. అష్టావక్రమునులు నలుబది కోట్లు గతించిన పాదద్రుజ్మునికి క్షణ కాలము అని చెప్పబడినది. అట్టి పాదద్రుజ్మునులు ఇఱువది అర్బుదముల కోట్లు గతించి నట్లయిన మహాదేవికి నిమిష కాలము గడుస్తున్నది. పు 55, 3 1/2 - 14 1/2

వెలుపల లోపల వ్యాపించినట్టియు, సూక్ష్మమైనట్టియు, సమర్థమైనట్టియు, నిత్య మైనట్టియు, రక్షకియైనట్టియు, ఆ మహా దేవి యీ సకల చరాచర సృష్టికి మూల భూతము. ఆమె జగత్తునకు ఆధార భూతము. సేవింపదగినది. అన్నింటినీ చూచునది. సమస్త లోకములకూ తల్లియై నట్టిది. జగదీశ్వరి. అనేక భుజములు గలది. అనేక ఉదరములు గలది. సకల శాస్త్ర ములకు, వేదములకు గోచరము కానిది. సకల శాస్త్రములకు వేదములకు అగోచర మై, శేషించి యుండునది. చెవులు లేకుండానే వినగల్గునది. కన్నులు లేకుండానే బహిరంతముల చూడజాలినది. పాదములు లేకనే అంతటా నడువ

గల్గినది. హస్తములు లేకుండానే ఇచ్చుట పుచ్చుకొనుట చేయునది. తనకు తానే హేతువై, జగత్తునకు మూలకారణమై యుండునది. యోగివరుల హృదయముల నందుండి, వారిచే చూడబడుచున్నది.

పు 55 15-19

అట్టి ఆ పరమేశ్వరి సృష్ట్యాది యందు హంస రూపములో వచ్చి వేదములను, సకల నిర్మాణములను చేసెను. సమస్త జగత్తులు లయమైననూ, బ్రహ్మ మొదలగు వారు అంతరించిననూ ఆమె మాత్రమూ ప్రకాశిస్తూనే వుంటుంది. సముద్రములన్నీ ఒక్కటే అయిననూ, జగత్తంతా అంధ కారము ఆవరించిననూ, తాను చలించక ఆ జగదీశ్వరి అంతటా వ్యాపించు మహా తేజస్సుతో సంచరించు చున్నది. మాయను కల్పించి ఆ మాయతో మహత్తత్వమును సృష్టించెను. తన శక్తిచే ప్రసిద్ధమైన మహదహంకారమును కల్పించెను. తదనంతరము ఆ ఈశ్వరి అహంకారము వలన సత్వ గుణమును, రజో గుణమును, తమో గుణమును కల్పించెను. ఆమెయే సత్వగుణముతో కూడి విష్ణువాయెను. రజోగుణముతో కూడి బ్రహ్మమాయెను. తమో గుణముతో కూడి శంకరుడాయెను. రజోగుణుడై ఉద్భవించిన బ్రహ్మ దేవునకు చతుర్వేద ములతో కూడా జగత్సృష్టియందు నేర్పరితనమును, సత్వగుణుడైన విష్ణువు నకు లోక రక్షణ బాధ్యత నప్పగించి, చక్రాయుధమును ఇచ్చెను. తమోగుణు డైన శంకరునికి జగత్సంహార శక్తిని ప్రసా దించి త్రిశూలమును ఒసగి ఆ పరమేశ్వరి నిజ స్వరూపమును ఉపసంహరించు కొనెను. ( పు 57 - 19 1/2 -26)

అనంతరము నాలుగు ముఖములు గల బ్రహ్మ లోకత్రయమును సృష్టించ దలచి, శివుని ధ్యానించుచూ ముహూర్త కాలము మహా యోగములో ఉండెను.

శక్తి స్మరణ మాత్రమున బ్రహ్మ మానసము నుండీ రెండవ సూర్యునివలె ప్రకాశించు 'అపరార్కుడు' ఉద యించెను. 'విరించి ప్రాణ వాయువు నందుండి దక్షప్రజాపతి పుట్టెను. బ్రహ్మ యొక్క అపానమందుండీ క్రతువు, వ్యాన వాయువు నందుండీ పులహుడు జన్మిం చెను. ఉదాన వాయువు వలన పులస్త్యుడు, సమాన వాయువు వలన వశిష్ఠుడు జన్మించిరి. ఆ వాణీవిభుని శిరస్సు నుండీ గగనమూ, వీనుల నుండీ వాయువును, కన్నుల నుండీ సూర్య చంద్రులు, ముఖము నుండీ ఇంద్రుడూ, అగ్ని పుట్టిరి. నాభి నుండీ అంతరిక్షము పుట్టెను. రోమకూపముల నుండీ లోకములూ,సమస్త అవయవాల నుండీ దేవతలూ పుట్టిరి. ఆ బ్రహ్మ ముఖము నుండీ బ్రాహ్మణులూ, భుజముల నుండీ క్షత్రియులూ, తొడల(ఊరువుల) నుండీ వైశ్యులూ, పాదముల నుండీ శూద్రులు జన్మించిరి. యక్షులు, రాక్షసులు, గంధర్వులు అశ్వినీ మొదలగు ఇరవై ఏడు నక్షత్రాలు, ఏకాదశరుద్రులూ, అష్టవసువులూ, ద్వాదశాదిత్యులూ, సప్త మాతృకలూ, సముద్రములూ, పర్వతములూ, పక్షిజాతులూ, నదులూ, వృక్షజాతులూ, తీగెలూ మొదలగునవీ, పశువులూ, వ్యాఘ్రము మొదలగు అరణ్య మృగములూ కూడా ఆ కమలాసనుని నుండీ పుట్టినవి.

(పు 59, 34 1/2 - 36 1/2)

వైశ్యప్రబోధిని, జూలై 1997

లోకములకు పితామహుడైన ఆ బ్రహ్మ తనచే సృష్టింపబడిన ఆ సకల ప్రాణులకూ వారి వారికి తగిన కార్యములనూ, వారి వారికి ఉచితములైన జీవనా ధారములనూ, వారి వారికి యోగ్యములైన ఆహారములనూ, వేరువేరుగా నివాస స్థానములనూ, నియమములనూ, బ్రహ్మచర్యాది ఆశ్రమములనూ, వివిధ జాతులనూ, నానా విధములైన దేశములనూ సృష్టించి సంతోషమును పొందెను.

పుట 59, 34 1/2 -36 1/2

ఆ తర్వాత ఆ బ్రహ్మ, తన అవయవ భేదము వలన పుట్టిన పుత్రులకు వర్ణ విభేదములను కల్పించి, నామ కర్మాదులను చేసి, వారిని వారి వర్ణము లకు ఉచితములైన ఆయా కర్మల యందు నియోగించెను. ఆ బ్రహ్మ తన వామ భాగము నుండీ స్త్రీలనూ, తన కుడి భాగము నుండీ పురుషులనూ సృష్టించి, సృష్టి వృద్ధి కొఱకు పలురకములైన పనులనూ ఏర్పరచెను. పు 76 1- 2 1/2

ఆ తర్వాత బ్రాహ్మణులకు వేద పాలనమునూ, రాజులకు ప్రజా రక్షణమునూ, వైశ్యులకు కృషి గోరక్షణ, వాణిజ్య పరిపాలననూ మిగిలిన సమాజావసరములను తీర్చు కర్తవ్యమును శూద్రులకూ ఇచ్చెను. బ్రహ్మ తన జ్యేష్ఠ పుత్రుడైన అంగీరసుని దేవతలకూ, బ్రాహ్మణులకూ, ఋషులకూ సకల కర్మల విషయమైన నియామకుని గానూ, తన మానస పుత్రుడైన వశిష్ఠుని క్షత్రియులకు నియామకుని గానూ, తన మఱియొక మానస పుత్రుడైన అపరార్కుని వైశ్యులకు శిక్షకుని గాను నియమించి కర్మభూమికి పోయి మీ పనులను నిర్వర్తింపుడు అని ఆజ్ఞాపించెను. (పు 76, 3 -6 1/2)

ఓ వైశ్యఋషులారా! ఆ విరించి, అవయవాదుల నుండీ ఉద్భవ మొందిన బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు సర్వులూ సమానులే. వారిలో ఒకరు శ్రేష్ఠులూ - మఱొకరు తక్కువ వారూ కారు. మానవ శరీరమందలి భాగముల వలె, సమాజము అను శరీరములో భాగమైన యీ నాలుగు వర్ణముల వారికీ, ఒకే ప్రాధాన్యత, అవశ్యకత, శ్రేష్ఠత ఉన్నది అని గమ నింపుడు. వృత్తిపరమైన విభేదములు రాకుండుటకు గానూ ఆ బ్రహ్మ వివిధ వర్ణముల వారికీ వృత్తులను వేరు వేరుగా నిర్ణయించెను. ఎవరి వృత్తిని వారు చేసుకొనుట వల్ల ఆ వృత్తిలో తగిన ప్రావీణ్యము కూడా పొందగలరు.

ఇది స్కాంధ పురాణమందు - సనత్సుజాతీయ సంహితగల ఉత్తర ఖండము - వైశ్యఋషులకు సాలం కాయన మునిచెప్పిన యుగ ప్రమాణము - సృష్టిక్రమము - నాల్గవ అధ్యాయము.

## ఐదవ అధ్యాయము

వైశ్య వంశము చాలా పవిత్రమైనది. వైశ్యులు సత్పురుషులు. సాధు జీవనులు ప్రపంచములోని ప్రజలకు ప్రాణాధారమైన ధాన్యమును పండించుట - పండించిన ఆ ధాన్య సంపదను ప్రజలందరికీ సకాలంలో అందించుట అనురెండూ వైశ్యుల వృత్తులే. అందుకే వారిని ప్రపంచములో ముందుగా పుట్టిన వారిగా గ్రంథములు పేర్కొన్నవి. "విష" శబ్దము నుండే "వైశ్య" శబ్దము పుట్టినది. "ఋజ్ఞోజాతం వైశ్య వర్ణ

మాహం" అని తైత్తరీయ సంహిత చెప్పును ఋగ్వేదము నుండీ వైశ్యులు పుట్టిరని దీని అర్థము. వేదముల కెల్లా ఋగ్వేదమే మొదటిది కదా!

ఆర్యావర్తము అను పుణ్య దేశమున 'ప్రతిష్ఠాన పురము' అను పట్టణ శ్రేష్ఠము కలదు. ఆ పట్టణము పుష్పోద్యానములతో అందముగా ఉండెను. ఆ పట్టణ ప్రజలు నర్మదా నదీ జలమును త్రాగుదురు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు ఆ పట్టణములో ఉండిరి. ఆ పట్టణము సకల రత్నములకూ నిలయము. ఆ పట్టణములో 'ధర్ముడు' అను పేరు గల వైశ్యోత్తముడు ఒకడు కలడు. అతడు జ్ఞానాధికుడు. సత్యసంధుడు. గుణవంతుడు. ఆచార వంతుడు. ధాన ధర్మములందు ఆసక్తి కలవాడు. బ్రాహ్మణ శుశ్రూష యందు ప్రీతి కలవాడు. యాచకులు కోరిన కోర్కెలు ఇచ్చువాడు. అతిథుల యందు ప్రీతి కలవాడు. ఆయనకు సంతానము లేదు. భార్య, అయన ఆ చింతతో దుఃఖించు చుండిరి. ఒక సమయమున అతడు యమునా నదీ తీరమునకు పోయి, 'భూమింజయుడు' అను బ్రాహ్మణుని చూచి, నమస్కరించి అర్ఘ్యము, పాద్యము మొదలగు వానిచే పూజించి, బ్రహ్మ విదులలో శ్రేష్ఠుడవైన ఓ భూమింజయా! నాకు సంతానము కలుగుటకు ఒక వ్రతమును చెప్పుము" అని ప్రార్థించెను.

అంత భూమింజయుడు "ఓ వైశ్యోత్తమా! జగజ్జనని అయిన ఆదిశక్తిని సదా పూజింపుము. ఆ తల్లికి గల పదునాల్గు నామములలో ఒకటైన కన్యక అను పేరుకు 'పరమేశ్వరి' అను పదాన్ని చేర్చి 'శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవి' అను పేరుతో మీ వంశస్థులు ఆరాధిస్తున్నారు ఆమెను సదా పూజింపుము ఆమెతోకూడ హవిస్సును భుజింపుము ఆశ్వయుజ మాసమున శుద్ధ విదియ రోజున దేవీ పూజను ప్రారంభించి, నిత్యమూ చేయుచుండుము. అని పలికి అంతర్ధాన మయ్యెను. వైశ్యోత్తముడగు ధర్మిసెట్టి అట్లే పూజించెను. అంత సంవత్సరాంతము నందు సర్వలోకములకూ తల్లి అయిన ఆదిశక్తి కన్యకా-పరమేశ్వరీ దేవి అతనికి ప్రత్యక్షమయ్యెను. ఆ తల్లిని చూచి, శీఘ్రముగ లేచి నమస్కరించి, ప్రీతితో ఆ వైశ్య వర్యుడు తామరరేకుల వంటికన్నులు కల తల్లీ! నీకు నమస్కారము, మహాదేవీ! నీకు నమస్కారము. పరమేశ్వరీ! దివ్యశక్తీ! జగన్మాతా! నీకు నమస్కారము" అని ఇట్లు స్తోత్రము చేసి తులసీ మాలలచే పరిమళించు చుండెడి ఆ పరమేశ్వరి పాదముల మీద పడెను. ఆ మహాదేవి ఆ ధర్మశ్రేష్ఠిని కరుణించి, ఈ మంచి వ్రతము వలన నీకు ఒక కుమారుడు జన్మిస్తాడు. అతడు నీ వంశమందు ధర్మము మూర్తీభవించినదా అన్నట్లుగా, ఒక కుమారుడు జన్మించి ప్రకాశించును" అని. పలికి ఆ తల్లి బ్రహ్మాది దేవ గణములతో అంతర్ధానమయ్యెను. ధర్మశ్రేష్ఠియును ఆ జగజ్జనని వలన తన అభీష్టమును సిద్ధించినందుకు సంతోషపడి ప్రతిష్ఠాన పట్టణమునకు చేరి తన గృహమున సుఖముగా ఉండెను.

12 1/2 - 19 అ.3 - పుట 25.

అనంతరము సంవత్సరము నిండి నంతనే ధర్మశ్రేష్ఠి భార్య పుత్రుని కనెను. బ్రాహ్మణోత్తములచే జాతకర్మ మొదలగు క్రియలను చేయించి, పద కొండవ రోజున నామకరణము చేయించు చుండెను. "ఆ సమయమున ఆకాశవాణి ఈ శిశువుకు 'ధర్మనందనుడు' అని పేరు పెట్టుడు" అని పలికెను. దానిని విని పురోహితులు అట్లుచేసిరి. ధర్మశ్రేష్ఠి మిక్కిలి సంతోషమును పొందెను.

19 1/2 - 22 అ.3 - పుట 25

పున్నమనాటి చంద్రుని వలె ఆ పుత్రుడు వృద్ధిని పొందెను. ఆ పుత్రునికి పండ్రెండవ సంవత్సరము రాగా, విధి ప్రకారమూ తండ్రి ఉపనయనము చేసెను. బుద్ధి కుశలుడైన ధర్మనందనుడు వేదములను అభ్యసించుటకై తల్లితండ్రుల ఆజ్ఞతో చ్యవనుడు అను గురువు వద్దకు పోయి నమస్కరించెను. పండ్రెండు సంవత్సరములు వారికి సేవచేసి వారి వలన ఆరు అంగములతో కూడిన వేదములను నిర్మలమైన బుద్ధితో అభ్యసించెను. ఆ ధర్మనందునుని సేవలకు చ్యవనుడు మిక్కిలి సంతోషమును పొంది, "నీవు గృహమునకు వెళ్ళి వివాహము చేసుకొని తండ్రి ఇంట సుఖముగా ఉండుము" అని పలికెను. "పండ్రెండు సంవత్సరములు గురువులగు తమ ఇంట ఉండి, ఆ వెనుక మీ ఆదేశమును పాలించెదను" అని ధర్మనందనుడు బదులు పలికెను.

22 1/2 - 27 అ. 3 - పుట 25

బుద్ధిమంతుడైన ధర్మనందనుడు ప్రతి దినమూ సాయంకాల, ప్రాతఃకాలములలో అగ్నిహోత్ర కార్యక్రమములలో గురువుకు తోడ్పడుచూ, ఎక్కువ కాలము సేవలు చేసెను. హోమము కొఱకు సమిధలను, పూజ కొఱకు పుష్పములను, బలి నివేదనమునకు ఫలములను, పవిత్రముల కొఱకు దర్భలను సంపాదించి, గురువుకు సమర్పించుచూ, ఆయన ఇచ్చిన ఫల మూలాదికములను భుజిస్తూ ధర్మనందనుడు ఎక్కువ కాలము ఉండెను.

27 1/2 - 30 అ .3 - పుట 27

మహనీయమైనదీ, సంతాన వృద్ధిని కలిగించునదీ, ధనమును ఇచ్చునదీ, కీర్తిని ఒసగునదీ, సుఖమునూ, పుణ్యమునూ ఇచ్చునదీ, సమానము లేనిదీ అగు ఈ ధర్మనందనుని కథను వినిన మానవుడు సకల సంకటముల నుండీ విముక్తుడగును.

31 1.3 - పుట 27

సాలంకాయన మునీంద్రులు ఇంకనూ ఇట్లు చెప్పుటకు ప్రారంభించెను. "ఆ ధర్మనందనుడు ఒకనాడు సమిధలు, పుష్పములు తెచ్చుటకొఱకు ఒక గొప్ప అడవికి వెళ్ళెను. పుష్పములనూ, ఫలములనూ సంపాదించుకొని వానిని పూల బుట్ట యందుంచెను. మరియొక స్థలమునకు పోయి సమిధలను మోపు కట్టుకొనెను. ఆ సమయమున "ఓరీ కిరాతకా! నేను అంగీరసుడు అను బ్రాహ్మణుడను. తీర్థ సేవాతత్పరుడను. నన్ను బాధ పెట్టకుము అని ఒక భయంకరమగు ధ్వని వినిపించెను. దుఃఖము కలిగించు ఆ దీన వచనములు విని, మనస్సులో ధర్మమును ఆలోచించి,

అచ్చటకు పోవుటకు ప్రయత్నించెను. జింక చర్మమును కప్పుకొని, కోల చేత పట్టుకొని, వస్త్రమును నడుముకు చుట్టుకొని, పూలబుట్టను ఒక చెట్టు కొమ్మకు తగిలించి, ఒక చెట్టు నుండీ మరియొక చెట్టుకూ, ఒక అడవి నుండీ మరియొక అడవికీ తిరుగుచూ, ఆ బ్రాహ్మణుని యొక్క, కిరాతకుని యొక్క ధ్వనిని వెదకుచూ వింధ్య పర్వత సమీపమందలి దుర్గమమగు అడవికి అతి శీఘ్రముగ వెళ్ళెను. ఆ అరణ్యమున కట్టివేయబడిన బ్రాహ్మణుని, ఆ బ్రాహ్మణుని బంధించిన కిరాతకుని చూచెను.

1 - 7 1/2 అ.4 - పుట 29

ధర్మనందనుడు ఓరి పాపీ! మూర్ఖ హృదయా! దుష్టచిత్తా! అధమ కులజుడా! సమస్త జాతులలో బ్రాహ్మణుడు ఎక్కువ. అతని యందు వేదములు నివసించు చున్నవి. వేదముల చేతనే దేవతలు ప్రతిష్ఠను పొందిరి. ఆ దేవతలే లోకములను రక్షిస్తున్నారు. ఓరీ కిరాతకుడా! దేవతలకూ, బ్రాహ్మణులకూ భేదము లేదని తెలుసు కొనుము. ఇపుడు నీవు బుద్ధితో బ్రాహ్మణుని పూజించి సుఖమును పొందుము" అని పలికెను.

8 - 10 అ.4 - పుట 31

ఆ మాటలను విని కోపముతో కన్నులు ఎఱ్ఱగా, కాగా ఆ కిరాతకుడు ధర్మ నందనునితో "దుర్బుద్ధిగల ఓ పిల్లవాడా! భయము లేకుండా మాట్లాడితివి. ఇప్పుడు నీవు కూడ ప్రాణములను విడిచి వీనితోనే పోదువు" అనెను. "శుభము అట్లనే కానిమ్ము. బ్రాహ్మణుని కొఱకై యీ దేహమును విడిచెదను. బ్రాహ్మణుని కొఱకు కానీ, గోవు కొఱకు కానీ ఎవరు తమ ప్రాణమును ప్రీతిగా విడిచెదరో అట్టి వారలు అందరూ బ్రహ్మ లోకమందు నివసించెదరు అని మనువు చెప్పెను. ఓరీ వ్యాధుడా! వెంటనే ఈ బ్రాహ్మణుని విడువుము. నేను నీ వెంట వచ్చెదను. నన్ను నీ యిష్ట ప్రకారము చేసుకొమ్ము. ఆలస్యము చేయకుము'' అని ధర్మనందనుడు పలికెను.

10 1/2 - 14 అ.4 - పుట 31

ఆ వాక్యములను విన్న కిరాతకుడు, బ్రాహ్మణ రక్షణము నందు ఆసక్తుడైన ధర్మనందనునిపై దయ కలిగి "ఓరీ బాలుడా! దేవతలతో సమానుడుగా ఈ బ్రాహ్మణుడు నీకు పూజింపదగిన వాడే అయిన ఆ ప్రకారమే కానిమ్ము. నాకు సంపదను కలిగించు ఒక గొప్ప కార్యము ఇతని వలన కావలసి ఉన్నది. అది యేమంటివా? వింధ్య పర్వతమున ఉండే శక్తికి ప్రతి సంవత్సరమూ ఒక పురుషుని బలిగా ఉస్తున్నాను. ఇది మా కుల ధర్మము" అని పలికెను.

10 1/2 - 14 అ.4 - పుట 31

(ఇంకావుంది)

## శ్రీ నటకుల సుబ్బరావు గారి స్వర్గారోహణ

కడప జిల్లా రాజంపేట వైశ్య ప్రముఖులూ, రాజంపేట కిరాణా మర్చంట్స్ అసోసియేషన్ అధ్యక్షులూ శ్రీ నటకుల సుబ్బరావు గారు 8-7-97వ తేదీన స్వర్గస్థులయ్యారు.

**ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభను జాగృతము చేయుటకు యీ పత్రిక ద్వారానూ, వ్యక్తిగతంగానూ తాను చేసిన సుదీర్ఘకృషికి గుర్తుగా, మైలురాయిగా ఉండాలన్న భావముతో ఈ పత్రికాధిపతి ఒక దశలో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభాధ్యక్ష పదవిని గురించి ఆలోచించాడు. ఈ సందర్భంగా శ్రీ జూటూరు వేమయ్య గారికి వ్రాసిన లేఖల్లో ఈ లేఖ మూడవది. మహాసభ ఈనాడు ఈ స్థితికి చేరుకోడానికి తొలినుండీ ఈ పత్రికాధిపతి నిర్వహించిన బలమైన పాత్రనూ, కార్యకర్తలకు జరుగు అన్యాయాన్నీ గుర్తు చేయుటకు మాత్రమే ఈ లేఖా ప్రచురణ. ఏ వ్యక్తినీ కించపరచుటకు కాదు. ఎవరికైనా అట్టి భావంకలిగితే వారిని మన్నించ మంటున్నాం.**

తేది . 18-03-1997

**శ్రీ జూటూరు వేమయ్య గారికి**

**ప్రొద్దుటూరు.**

ఆర్యా!

నా మీద మీకు గల నిష్కారణ ద్వేషముతో జిల్లా సంఘాధ్యక్షుడూ, శ్రీ జూటూరు రమణయ్య, శ్రీ కామిశెట్టి సుబ్బరావు, శ్రీ వంకదారి వీరభద్రయ్య గారలు పలు దఫాలుగా చెప్పినా - వినక - నా పేరును జనరల్ కౌన్సిల్ సభ్యుల జాబితాలో చేర్చలేదు. "మహాసభలో శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్ఠి సభ్యుడు కాదు" అని బాగా ప్రచారం చేశారు. నేను అధ్యక్షుణ్ణి కాకూడదనే ఇలా చేశారు అనేది సుస్పష్టము.

నాతో - మీరు - మహాసభలో ఎన్ని సార్లు ఎన్ని పనులు చేయించారో గమనం చేసుకోండి. అప్పుడు ఈ సభ్యత్వం మీకు గుర్తుకు రాలేదా! అప్పుడు లేని గుర్తు ఇప్పుడు వచ్చిందా?

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభతో 1970 నుండీ అంటే శ్రీ నారాయణ శ్రేష్ఠి గారు అధ్యక్షులుగా ఉన్నప్పటి నుండీ ఏదో ఒక రకంగా సంబంధం ఉంది. నేను కోరకుండానే ఏదో ఒక పదవి ఉంటూనే ఉంది అప్పటి అధ్యక్షులెవరూ లక్ష్మీకాంతం సభ్యుడా! అని ప్రశ్నించలేదు. మీ మహాసభ ప్రవేశం 1976 తర్వాతేగా?

1976లో - "నన్ను ఈ సారి కార్య వర్గములో వేయకండి అని శ్రీ కె సి. గుప్త గారితో అన్నావట. ఇదేమిటి? ఒక వైపు అందరం కలిసి ఒక సంవత్సరం శ్రమ చేద్దామని ప్రతి నిత్యం అంటున్నాను అందరితో. కనుక నీవే ఇలా ఆలోచించడం మంచిది కాదు. నీ అంగీకారం వ్రాయ కోరెద" అని 8.7.1976న,

"నీవు 8.2.76 కార్యవర్గ సమావేశానికి రాకపోతే ఎలా? సరాసరి కందుకూరు వెళ్ళవచ్చు. రాత్రి 8 గంటలకు బయలుదేరి'-అనీ 5.2.1976న శ్రీ రోశయ్య గారు మహాసభ అధ్యక్ష స్థానం నుండీ వ్రాశారు. అప్పుడు లేని అనర్హత ఇప్పుడు ఎలా వచ్చింది? వాటిని విస్మరించారా? విస్మరించడం పాపహేతువు కాదా! అంటే

నేను వద్దన్నా కార్యవర్గములోకి తీసుకున్నారు. అంగీకరించమని కూడా వ్రాశారు. భావ స్వేచ్ఛను కోల్పోవడం కాదన్నారు. ఆ ఉత్తరాలను ఈ లేఖతో పాటు పంపుచున్నాను ఋజువుకు.

వైశ్య పత్రికల సంపాదకులు నేరుగా వైశ్య మహాసభకు జనరల్ కౌన్సిల్ సభ్యులు - అను పద్ధతిని చాలా కాలం పాటించాము. అందుకే కడప జిల్లా సంఘము నుండీ, నేను కాక, మరి ఐదుగురిని జనరల్ కౌన్సిల్‌కు ఎన్నుకొంటూ వచ్చాము. అలా ఎన్నుకోమని నేనే చెప్పాను. ఒక సందర్భములో మీరు కూడ చెప్పినట్లు గుర్తు. ఈ రకంగా లభించిన ఓటుతోనే మీ ఎన్నికల్లో ఓటు చేశాను. అప్పుడూ ఈ 'అబ్జక్షన్' వచ్చింది.

మీరు అధ్యక్షులైనప్పటి నుండే - నేను మహాసభకు దూరం కావడము మొదలు. మీరు అధ్యక్షులగుటకు ముందు ఒకనాటి రాత్రి "లక్ష్మీకాంతం నీ మీద బరువు పెరుగుతుంది. బాగా సహకరించాలి. మనము అనుకున్న భావాలను మహాసభలో ప్రవేశ పెట్టుటకు అవకాశం వచ్చింది" అని స్వయంగా మీకై మీరే నాకు ఫోను చేసి చెప్పారు. అయితే ఇవి మన ఇద్దరి మధ్య జరిగిన సంభాషణలు కనుక సాక్ష్యాలుండవు. మీరు ఆధ్యాత్మికవాదులు కదా! అట్లా అంటారని భావించననుకోండి. ఆ తరువాత మీలో మార్పు వచ్చింది. ఆ మార్పును చూచి నేనూ దూరంగా ఉంటూ వచ్చాను. "వైశ్య మహాసభకు కావాలనే మీ వేమయ్య దూరంగా నిన్ను ఉంచుతున్నాడు" అని నాతో పలువురు పెద్దలు అనేక సార్లు అన్నారు. అయినా నేను వాటిని పట్టించుకోలేదు. పట్టించుకొని వుంటే "వైశ్య వైజయంతిక"లో అంతగా మిమ్ములను గురించి వ్రాసేవాణ్ణి కాదు. మీరు నా విషయంలో ఆలోచించినట్లు నిష్కారణ ద్వేషముతోనో కుచ్చితంగానో ఆలోచించి ఉంటే అలా వ్రాసే వాణ్ణే కాదు. నేను "వైశ్య వైజయంతిక"ను ఇచ్చినంత వరకూ మీ పరిచయం ఉన్నట్లు మీకు తెలుసా! చెప్పండి. అయినా నా పై కృతజ్ఞతకు మారుగా కృతఘ్నతను చూపుచున్నారు. కృతఘ్నతా ఫలితాన్ని గురించి నాడీజంఘుని వృత్తాంతము చదవండి. నాడీజంఘుని వృత్తాంతము భారతము శాంతిపర్వంలో ఉంది.

మీ హయాము నుండి మహాసభకు వీలైనంత దూరంగా ఉన్నా, మహాసభలో ఏదో ఒక రీతిగా నా పేరు ఉంటూనే ఉంది. లేదని ఋజువు చేయండి. నాకు జనరల్ కౌన్సిల్ సభ్యుణ్ణి అయ్యే అర్హతే లేకపోతే, ఎందుకు వేస్తున్నట్లు? మీరు కూడ వేశారు. అప్పుడు లేని అనర్హత మీకు ఇప్పుడు కనిపించిందా?

"మమ్మందరనూ ఈ రంగములోకి మళ్ళించింది నీవనేది మరచి పోలేము ఎవ్వరమూ - దీని అభివృద్ధికి జరుగుచున్న ప్రయత్నాలలో కూడ నీ నుండి తోడ్పాటు నిండుగా వాంఛిస్తాము" అనీ,

"వైశ్య జాతిని చైతన్యవంతము చేయుట లో నీ పాత్రను గురించి. నాలుగు మాటలు ఉత్తరములో వ్రాస్తే సరి పోతుందా? చాలదు. మహాసభ బాధ్యతలను నేను, శ్రీ వేమయ్య గారు తీసుకొనుటలో ప్రేరణ నీదే" - అని శ్రీ రోశయ్య గారు వ్రాశారు. ఆ ఉత్తరాల నకళ్ళను మీకు పంపుచున్నాను. అంటే మీకు మహాసభా ప్రవేశం కలిగింది నా వల్లనే అని స్పష్టమైంది కదా! అట్టి మీరే నన్ను అనర్హుడని అనడం విజ్ఞులు ఏమంటారు. ఎంతగా మిమ్ములను విమర్శిస్తారు. మీ వ్యక్తిత్వం మీద ఎంతగా ప్రభావం చూపుతుంది. అంటే మహాసభ అర్హత విషయం వస్తే - అర్హత నాకే - తర్వాతే మీది. కాదంటారా?

నిష్కారణ ద్వేషంతోనో, కుచ్ఛితమైన భావనలతోనో ఆలోచిస్తారని ఊహించు కోలేక పోయాను. అంతేకానీ రూ.105/-లు కట్టలేక కాదు. మీరు ప్రధాన కార్యదర్శిగా ఉన్నపుడు జరిగిన వరంగలు మహాసభలకు అధ్యక్షోపన్యాసం వ్రాయించమంటే రెండు రోజులు ద్వారకా హోటల్లో ఉండి వ్రాయించి వచ్చాను నా ఖర్చులతో. ఐదు వందలైనా ఖర్చయి ఉండవా? ఆలోచించండి. ఆనాటి నా ఆర్థిక స్థోమత ఏమిటి? మహాసభ నుండీ తీసుకున్నానా? జీవిత సభ్యత్వం రూ.105/- లే కదా. ఐదు వందలు ఖర్చు పెట్టిన వాన్ని రూ.105/-లు కట్టలేనా?

మహాసభాధ్యక్షులుగా శ్రీ రోశయ్య గారి అనంతపురం జిల్లా పర్యటనను ఏర్పాటు చేయుటకు కృషి చేసింది మీరా? నేనా? అప్పుడు మీరు మహాసభకు ప్రాంతీయ కార్యదర్శులు అయి కూడ ఎంత శ్రద్ధ తీసుకున్నారు పర్యటనను ఏర్పాటు చేయుటకు నేను ఐదు పర్యాయాలు అనంతపురం వెళ్ళి వచ్చాను. నాకు మహాసభ ఇందుకు ఏమైనా ఇచ్చిందా? ఆ ఖర్చులు కూడ రూ.105/-లకు ఎక్కువే కదా? అనంతపురం జిల్లా పర్యటనా నంతరము శ్రీ రోశయ్య గారు వ్రాసిన ఉత్తరం నకలు పంపుచున్నాను ఋజువుకు.

మహాసభకు దూరంగా ఉన్న శ్రీ రోశయ్య గారినీ, మిమ్ములను, మరి కొందర్నీ మహాసభ కృషిలో పాల్గొనునట్లు చేసిన నాకు -ఈనాడు జనరల్ కౌన్సిల్ సభ్యత్వము లేదు అని మీరు తిరస్క రించడాన్ని ఏమంటారు? మొరటుగా చెప్పాలంటే పని జరిగిన తర్వాత తెడ్డును పొయ్యిలో పెట్టడమనే కదా? వేదాంతిగా ఉండి ఇలా వ్యవహరిస్తున్నారని తెలిసిన వారికి మీమీద ఎటువంటి ఏహ్య భావము కలుగుతుందో ఇప్పుడైనా ఆలోచించి - చేసిన తప్పును పరిదిద్దుకోండి.

నియమావళి పేరుతో నాకు అవకాశం లేకుండా చేయాలి అని కదా! ఇప్పటి మీ పట్టుదల. "నేనే నియమావళిని తయారు చేశాను. దాన్ని ఎలా కాదనను. కాదని వ్యవహరించుటకు నా మనస్సు అంగీకరించుట లేదు" - అని శ్రీ జూటూరు రమణయ్య గారితో మీరు అన్నారట. కడప జిల్లా ఆర్యవైశ్య సభాధ్యక్షుల ఎన్నిక మీరు

చెప్పుకొనుచున్న నియమావళి ప్రకారం జరిగిందా? జరుగలేదు. అయినా, మీ మనస్సు అంగీకరించింది.

యాభై మంది జీవిత సభ్యులూ కలిసి ఒకరిని ఎన్నుకోవాలి అని కదా! నియమావళి. ఆ విధంగా యాభై మందీ కలిసి ఎన్నుకున్న వ్యక్తినే జనరల్ కౌన్సిల్‌కు పంపారా? అయినా మీ మనస్సు అంగీకరించింది.

మీ మనస్సును చంపుకోవడం ఎందుకు? కడప జిల్లా ఆర్యవైశ్య సంఘం అధ్యక్షుణ్ణి ఎన్నికనూ, జనరల్ కౌన్సిల్ సభ్యుల ఎన్నికలు కూడ ఖచ్చితంగా నియమావళి ప్రకారమే జరిపించండి. అప్పుడే మీరు శ్రీ రమణయ్య గారితో అన్న "ఆ మనస్సు చంపుకోవడం" అను మాటలకు పవిత్రత చేకూరుతుంది. ఆ మాటలు చిత్తశుద్ధితో చెప్పినవే అని శ్రీ రమణయ్య గారు నమ్మేందుకు అవకాశం ఉంటుంది. మీ నిజాయితీని అందరూ హర్షిస్తారు. అలా జరపలేక పోతే జనరల్ కౌన్సిల్‌కు నా పేరు పంపండి.

జనరల్‌కౌన్సిల్‌కు పేర్లను పంపు వ్యవధి గడిచి పోయింది అని మీరు అనవచ్చు. రాష్ట్రంలోని అన్ని జిల్లాల అధ్యక్ష ఎన్నికలూ - జనరల్ కౌన్సిల్ సభ్యుల ఎన్నికలూ ఫలానా తేదీ లోగా జరగాలి"- అని మహాసభ జిల్లా సంఘాలకు తెలియజేసింది కదా? అన్ని జిల్లాల ఎన్నికలూ మహాసభ నిర్ణయించిన తేదీల లోగానే జరిగాయా? ఆ తరువాత జరిగిన జనరల్ కౌన్సిల్ సభ్యుల విషయ మేమిటి?

అనంతపురంజిల్లా ఆర్యవైశ్య సంఘానికి గౌరవాధ్యక్షులను ఎన్నుకొన్నారు. జిల్లా సంఘాల నియమావళిలో గౌరవాధ్యక్ష పదవి ఉన్నదా!

రాష్ట్రంలో జరిగిన అన్ని జిల్లాల ఎన్నికల తీరునూ తెలుసు కొన్నాను. పరిస్థితి చేయి జారకుండా తగిన సర్దుబాట్లు జరిగినట్లుగా వార్తలు అందుచున్నవి.

నాకు బాగా గుర్తు. కొందరు కుల సంఘాల్లో సభ్యత్వం స్వీకరించను. అంగీకరించని వారు ఉండవచ్చుననీ, వారి సేవలు మహాసభకు అవసరం వస్తాయని భావించే ఐదు మందినీ ఎన్నుకునే పద్ధతిని మనము అం.ప్ర. ఆర్యవైశ్య యువజన సంఘాల సమాఖ్య నుండీ తీసుకున్నాము.

నియమావళి అన్నది కేవలం మార్గదర్శకమే. దాన్ని ఉపయోగించుకొని మరొకరిని వేధించుటకు కాదు.

ఇప్పుడు చెప్పండి. వీటన్నింటికీ లేని నియమావళి నా వరకే పరిమితం చేయడాన్ని ఏమంటారు? నా పై మీకు గల నిష్కారణ ద్వేషాసూయల వల్లనే కదా? మీరు వేదాంతులు కదా? వేదాంతి అసూయద్వేషాలకు తావిస్తాడా? అందునా, నిష్కారణంగా. ఇటువంటి అంశాలలో పవిత్రతను చూపినపుడే 'వేదాంతి' అను పదానికి సార్థకత. నిజమైన వేదాంతి అసూయాద్వేషాలను తన పరిసరాలకు కూడ రానీయడు.

లక్ష్మీకాంతం ఎన్ని వ్రాస్తే నాకు ఏమౌతుంది? అని అనుకొని మీరు

సర్దుకోవచ్చు. ప్రపంచానికి తెలిసినపుడు మీ మీద గలిగే భావము ఎంత చెడ్డదిగా ఉంటుందో ఆలోచించండి. అనుకుంటే, అనుకున్న వాని మనసే చెడిపోతుంది. అనుకుంటే నేను ఏమీ చెప్పలేను. మీరు వేదాంతులు కదా? ఇతరులకు ఉపదేశాలు ఇస్తూ ఉంటారు కదా? అందువల్ల అలా అనుకోరని విశ్వసిస్తున్నా.

1974 నుండీ మనిద్దరమూ కలిసి తిరిగాము. చాలా మందికి తెలియక పోయినా - పని 'గట్టుకొని మీ 'పేరును కార్యక్రమాల్లో చేర్పించాను. నా వెంట మిమ్ములను తీసుకువెళ్ళిన ప్రతి చోటా ఎంతో గౌరవం మీకు చేయించాను. లక్ష్మీకాంతం! ఎంత 'స్పేడ్ వర్క్' చేశావ్ అంటూ అభినందించిన సందర్భాలు కూడ ఉన్నాయి. గుర్తు చేసుకోండి.

"లక్ష్మీకాంతం అంతా నేనే చేశాను అంటాడు - అదే నాకు ఆయన మీద ఆగ్రహం" అని కొందతితో అన్నారట. నేను ఏదైనా అసత్యం చెప్పానా? అతిశయంగా మాట్లాడనా? ఒక్క సందర్భం చెప్పండి. అది కూడ సందర్భం వచ్చినపుడు ఆ సందర్భాన్ని పట్టి అని ఉంటానే 'కానీ అహంకారంతో మాత్రమే కాదు. అహంకారినే అయితే మీరు చెప్పిన పనులను కేవలము పనివానిగానే భావిస్తున్నా చేశాను. మహాసభనూ - వైశ్య సంఘాన్ని దృష్టిలో పెట్టుకొని. ఎక్కడైనా సందర్భము వచ్చి చెప్పి ఉంటే అవి అసత్యాలని గుండె మీద చెయ్యివేసుకొని చెప్పండి. ఋజువులు చూపిస్తున్నాను కదా. పది మంది ముందుకు వచ్చి. - కాదు - అని నిరూపించండి

ఇది నేనే చేశాను ఈ సలహా నేనే ఇచ్చాను. ఇది ఇలా ఉంటే అలా సరిచేశాను అని శ్రీ రోశయ్య గారికీ, శ్రీ రాధా కృష్ణయ్య గారికి మీరు నా ముందే ఎన్నో సార్లు చెప్పారు. మీ పరిభాషలోనే అనాల్సి వస్తే ఏమనాలి? 'అహంకారము' అనే అనాలి కదా?

నిరూపించలేక పోయినపుడు ఈ మీ నిర్ణయం నిష్కారణ ద్వేష అసూయలకు తార్కాణం అని అంగీకరించండి.

నమస్సులు
భవదీయుడు
పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి, 18-3-97

## విశాఖపట్నంలోని శ్రీ వాసవీ కళ్యాణ మండప సంఘం వారిచే మహిళలకు ఉచిత శిక్షణా తరగతులు

పై సంఘము వారు ఆర్యవైశ్య మహిళలకు ఆంగ్లవ్యాకరణము - డ్రాయింగ్, పెయింటింగు, బొమ్మలు, ఆట వస్తువుల తయారీలో 4-6-1997 నుండీ 14-6-1997 వరకు పదిరోజులు ఉచితంగా శిక్షణా తరగతులు నిర్వహించారు. ఈ సందర్భంగా 4-6-1997వ తేదీన జరిగిన ప్రారంభోత్సవ సభకు పై మండప సంఘం అధ్యక్షులు శ్రీ కంకటాల అప్పలరాజు గారు అధ్యక్షత వహించారు. విశాఖ జిల్లా విద్యా శాఖాధికారి శ్రీ కె. రమణయ్య గారి జ్యోతి ప్రజ్వలనతో ప్రారంభమైన ఈ సభలో శ్రీ రమణయ్య గారు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 జులై 21 నుండీ 1997 ఆగస్టు నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 27 | 3 | 10 | 17 | |
| సోమవారము | 21 | 28 | 4 | 11 | 18 | |
| మంగళవారము | 22 | 29 | 5 | 12 | 19 | |
| బుధవారము | 23 | 30 | 6 | 13 | 20 | |
| గురువారము | 24 | 31 | 7 | 14 | | |
| శుక్రవారము | 25 | ఆగస్టు 1 | 8 | 15 | | |
| శనివారము | 26 | 2 | 9 | 16 | | |

జులై 31 - పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1997 జూన్ నెలలో చెల్లించిన జీతము, ఆజీతములో తగ్గించి పట్టుకున్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంట్ ఫారము నెం 21 ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి [illegible]ప్పుటకు చివరి తారీఖు

జులై 31 :- 1997 జూన్ నెల జీతములో పట్టుకున్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు కడపటి రోజు.

ఆగస్టు 3 :- అశ్లేష కార్తె

ఆగస్టు 7 :-నాగచతుర్థి ( నాగుల చవితి)

ఆగస్టు 8 :- నాగపంచమి

ఆగస్టు 15 :- చెక్కు ద్వారా అమ్మకంపన్నును చెల్లించు వర్తకులు ఆ చెక్కుతో బాటు A2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు ఆఖరురోజు.

ఆగస్టు 15 :- భారత స్వాతంత్ర్యదినము. దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము - వరలక్ష్మీవ్రతము.

ఆగస్టు 16 :- శని త్రయోదశి

ఆగస్టు 17 :- మఖ కార్తె రాక ఉ॥ 10.54

ఆగస్టు 20 :- A2 రిటర్నును [illegible] బాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు చివరితేది.

## 27, 3, 10, 17 ఆదివారాలు

నన్ను మీ టేబుల్‌పై ఉంచుకోండి . ఈ నెలంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను

# గృహవాస్తు - అవగాహన

శ్రీ యస్. హనుమంతయ్య
రిటైర్డు ఇంజనీర్, అనంతపురం

ప్రస్తుతము గృహవాస్తు బహుళ ప్రచారములో నున్నది. ఇది ఒక సామాజిక దుగ్మతగా మారిందనుటలో సందేహ ములేదు. 10-15 సంవత్సరముల క్రితము వరకు వాస్తు ప్రస్తావన చాలా అరుదుగా నుండెడిది.

వాస్తు అంటే స్థల సేకరణలోగాని, ఇల్లు కట్టుకొనుటలో గాని తీసికొనవలసిన జాగ్రత్తలు. అవి పాటించక పోతే ఎదురయ్యే కష్టసుఖాలను తెలియచేయునదిగా అందరికీ తెలిసిన అర్థము.

ఆధునిక యుగములో గృహనిర్మాణము గురించి సివిల్ ఇంజనీరింగ్ నేర్ప బడుతుంది. సృష్టిలో మానవ మనుగడకు కావలసిన వాటి ఆధారముగా నేర్పబడు తుంది. ఆరోగ్యవంతమైన జీవితము గడుపుటకు ప్రతి మనిషికి ముఖ్యముగా కావలసినవి. (1) శుభ్రమైనగాలి (2) వెలుతురు (3) శుభ్రమైననీరు (4) ఆహారము (5) మానసిక సంతృప్తి. పై నుదహరించిన మొదటి మూడును మనము కట్టుకొన్న ఇంటినుండీ లభ్యమగును. నాల్గవది మన కృషితో లభించును. అయిదవది మొదటి నాలుగు అనుకూలించినపుడు సదవగాహనతో లభించును. కనుక స్థల సేకరణగాని, ఇల్లు కట్టుకొనుటగాని పై వాటిని దృష్టిలో నుంచుకొని చేయవలయును.

ప్రస్తుతము ప్రచారములో నున్న వాస్తు పై వాటి గురించి బోధించదు. మానవుని దశ దిశతో మారుతుందనీ, ఆయింటి ఆవరణములోని నీరు ఈశాన్యదిశగా ప్రవహించిన మంచిదనీ, నైఋతి దిశ ఎత్తుగా నుండి ఈ శాన్యము వైపు పల్లముగా నుండవలెననీ, ఇంటి ముఖ ద్వారము ఉత్తరమునకుగాని, తూర్పు నకుగాని ఉండవలెననీ, దేవునిగది ఈశాన్యము దిశగా నుండవలెననీ, అగ్నేయమున వంటగది యుండవలెననీ, నైఋతి దిశలో యజమాని పడకగది యుండవలెననీ చెప్పుచున్నారు. ఇచ్చట నుదహరించినవి కొన్ని మాత్రమే. అయితే వీటికి ఆధారము మాత్రము నిర్వచించుట లేదు. అయిననూ సామాన్యులేకాక విద్యావంతులు కూడా పైవిషయముల గురించి తర్కించక స్థలము కొనాలన్నా, అమ్మాలన్నా, ఇల్లు కట్టుకోవాలన్నా, అద్దెయింటిలో చేరాలన్నా ప్రస్తుతము ప్రచారములో నున్నవాస్తును అనుసరించి అకారణ భయములకు గురియగు చున్నారు. పేదరికానికీ, రోగాలకూ, బాధలకూ, నిరుద్యోగానికీ, పైచదువులకూ పదవులు రావటానికీ, వివాహ అడ్డంకులు తొలగటానికీ, ఇంటిలో కలతలు లేకుండా ఉండడానికీ వాస్తు ఏకైక కారణముగా నమ్మించుచున్నారు. ఈ మధ్య వాస్తు నిపుణుల సలహా ప్రకారము కట్టిన ఇంటిలో నివసించిన వారికి వచ్చిన కష్టముల గురించి ప్రశ్నించగా వారు దశ సరిగా లేదని చెప్పుచున్నారు. కనుక వాస్తు వారు చెప్పునది నమ్మదగినదిగా నున్నదా?

యని చదువరులే నిర్ణయించుకొనవలెను. గుడ్డిగా అనుసరించిన ఎన్ని కష్టములూ, నష్టములూ వచ్చునో ఊహించుటకష్టముగా నుండును. ఒకవేళ మన గృహము లన్నింటినీ వాస్తు ప్రకారముగా వారుచెప్పిన ప్రకారము కట్టిన మన కష్టములన్నియు తొలగిపోవునా? అయితే నిరుద్యోగము తొలగుటకూ, బీదవారు ధనవంతులగుటకూ, వివాహ అర్థంకులు తొలగుటకూ, రోగముల బారినుండి తప్పించుకొనుటకూ సులభమైన మార్గమే. ఇది సరియైనదని వాస్తు నిపుణులు అంగీకరిస్తారా! ఏకట్టడానికైనా పునాదు లవసరము. పునాదులు లేని యిల్లు నిలువజాలదు. వాస్తు శాస్త్రములో దీని ప్రస్తావన ఏమాత్రమూ లేదు. భవనానికి పొడవు, వెడల్పు, ఎత్తులకు ఏమాత్రమూ ప్రాధాన్యతలేదు. పునాదుల గురించీ యింటి ఎత్తుగురించీ తెలుపని శాస్త్రము సంపూర్ణ గృహవాస్తు కాజాలదు.

ఇటీవలి కాలంలో వాస్తును గురించి కొంతమంది స్వార్థబుద్ధితో ప్రజల బలహీనతను గ్రహించి, సూక్తులు రూపొందించి, అంత్యప్రాసలతో, పదబంధాలతో దిన, వార, మాస పత్రికలలో ప్రచారము చేసి ప్రజలను ఆకర్షింపజేసి, కష్టనష్టాలకు గురిచేయుచున్నారు. కనుక వాస్తు వాస్తవాలను ప్రజలకు తెలియచేయుటకు ఇంజనీరింగు నిపుణులు ముందుకు వచ్చి ప్రజలను చైతన్యవంతులను చేయుట ఎంతైన అవసరమున్నది. కనీస ధర్మము కూడాను.

మనము సుఖ శాంతులతో వర్ధిల్లాలంటే విచక్షణతో ఆధునిక మార్గమున పయనించవలెను.



ప్రముఖ వైద్యులు డా॥ Y రాము M.B.B.S., M.D., (A.M.) M.D.R.C., రామక్రిష్ణ డయాబెటిస్ సెంటర్ నెల్లూరు వ్రాసిన అధినేత "గర్భిణీ స్త్రీలలో మధుమేహ వ్యాధి (డయాబెటిస్) - తీసుకోవలసిన జాగ్రత్తలు" అనే పేపరును ఇంటర్‌నేషనల్ డయాబెటీస్ ఫెడరేషన్ (International Diabetes Federation) వారు మొదటిశ్రేణి ఉత్తమ రచనగా యెన్నిక చేసి జూలై నెల 20-25 తేదీలలో HELSINKI FINLANDలో జరుగు International Diabetes Federatin Congress సమావేశమున అతిథిగా ఆహ్వానించి యున్నారు. డా॥ రాము గారికి చిన్నవయసులోనే International Diabetes Federatin సంస్థచే ఇటువంటి గౌరవ పురస్కారము లభించడము గర్వకారణం.

డా॥ రాముగారు భారతదేశములోకెల్ల అత్యుత్తమమైన Diabetes Research Centre మద్రాను నందు పోస్టు గ్రాడ్యుయేషన్ M.D.R.C.. చేసి మద్రాసు నందు Life Line Diabetes Centre నందు పనిచేసి ఇప్పుడు నెల్లూరులో రామక్రిష్ణ డయాబెటీస్ సెంటర్ స్థాపించి మహా నగరములకు సమానమైన అత్యుత్తమ సేవలు అందించు చున్నారు. వారు ఈనెల 18వ తేదీన బొంబాయి నుండీ FINLANDకు బయలుదేరు శుభ సందర్భమున శ్రీ దేవరశెట్టి మోహన్ కుమార్, శ్రీ యేల్చూరి జగన్నాథం శ్రేష్ఠి, వారి కుటుంబ సభ్యులూ తమ హార్దిక శుభాకాంక్షలు అందిస్తున్నారు.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

(రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)

టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"

టెలిఫోన్ నెం. - మార్కాపురం : 22740, 22004

శ్రీశైలం : 87140, 87114, తిరుపతి : 50030

పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682

## వైశ్య యాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25 12 62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

15×9 రూముకు రూ.30000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు 1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. **దాతకు** 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1 రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును 2 రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును దాత ఫోటో వేయబడును 3 రు 1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50x100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును

హాల్సు డోనార్సు : 50x12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు రూము యివ్వబడును 14 అంకణములు పరిమితం.

రు.2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును

అన్నదానమునకు రు 100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు తాత్కాలికముగా ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన-కోర్తాము.

వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. పోటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. పోటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు 1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు-నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్ధ మహా క్రతువు పై క్రతువు జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును మొదటి రోజు శ్రీమన్నారాయణుని దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు, మూడవరోజు అష్టలక్ష్మీ క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువు ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ క్రతువు, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 2 నుండి 7 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష దీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వైశ్యులు నగర రాజ్యాధీశులు

స్వర్గీయ విద్వాన్ అంబటి సుబ్బరాయగుప్త

గత సంచిక తరువాయి

## ఆర్థిక పరిస్థితులు

ఆ కాలమందు వ్యాపార మన్ని విధముల నున్నత స్థితి యందుండుటచే వ్యాపారమే ముఖ్యవృత్తిగా గల వైశ్యులు మంచి ధనాధికులై యుండిరనుటకు పెనుగొండ మొదలగు పదునెనిమిది నగరములందలి వైశ్యుల ధనధాన్యాదిక వైభవాధిక్యతయే వేనోళ్ళ జాటగలదు. విష్ణువర్ధనుడు పెనుగొండ నగర సమీప మందుండిన క్రీడావన మధ్య మందలి వైశ్యసౌధము యొక్క వైభవోన్నతి యప్పటి వైశ్యుల సౌభాగ్యసమృద్ధిని చాటి చెప్ప గలదు.

ఆలోకయన్ స్థితానేవం । విస్మితే
వనమధ్యమే
దదర్శ హేమరత్నాఢ్యం। రమ్యహర్మ్యం
మనోహరమ్

(వా.క.పు. చతుర్థాశ్వాసం 77 శ్లో)

ఇక పెనుగొండ పురమన్ననో -

అధాదృశ్యత సౌధాఢ్యం । పురం భువన
మోహనం
... ... పురీస్వర్గ-పురోపమం॥

స్వర్గపురముతో సమానమై, భువన మోహనమగు సౌధరాజముల గల్గి వెలయు చుండ నా పెనుగొండ నగరమును, విష్ణువర్ధనుడు గాంచెను. విష్ణువర్ధనుని వంటి రాజేంద్రునికే యిట్టి యాశ్చర్యము గొలుపగల్గిన పెనుగొండ నగరము, అందలి వైశ్యుల భాగ్యసౌభాగ్యములు వైభవా ధిక్యతయు వర్ణనాతీతములుగా నుండిన వనుట అతిశయోక్తి కాదు.

ఇట్లానాటి వైశ్యులు ధనాధికులై, వివిధములగు విపుల, వాణిజ్య, వ్యాపార ముల కధినాథులై యుండిరనుట కిట్టి వాసవకన్యకాపురాణాదిక గ్రంధసాక్ష్యములే గాక ఆనాటి సమకాలిక శాసనాదిక చారిత్ర కాధారములు 'గూడా పెక్కుగలవు. క్రీ శ 1022 నుండి 1058 వరకు వేంగిదేశము పాలించిన రాజరాజనరేంద్రుని యొక్క యూ, అతని పెదతండ్రి యగు శక్తివర్మ (999-1011) యొక్కయూ బంగారు నాణెములు కొన్ని యిటీవల బర్మా, అరకాను, సయాము మొదలగు విదేశ ములందు గానవచ్చినవి. దీనినిబట్టి ఆనాటి ఆంధ్రవణిజులు విదేశవ్యాపారము విరివిగా సాగించుచుండిరని చెప్ప వచ్చును. (రాజరాజనరేంద్రుని పట్టాభిషేక సంచిక 14 వ పుట) ఇప్పటి యలమంచిలికి సమీపమున నున్న "దిమిలి" అను చిన్న గ్రామము పూర్వము "దివ్వెల" అను పేరుతో సముద్రము మీద పయనించు వర్తకపుఓడలకు మార్గ దర్శములను దీప స్తంభములు, గలిగి వెలయుచుండెడిది. (కుబ్జవిష్ణువర్ధనుని చీపురుపల్లి శాసనము కళింగదేశ చరిత్రములను చూడుడు.) విదేశ వ్యాపారమట్లు సాగించుట

కనుకూలముగా నాటివైశ్యులు బహు భాషాభిజ్ఞులై యుండెదరని, క్రీ.శ 1162 సం॥రము నాటి అనంతపురము జిల్లా శాసనమొకటి తెలియుచున్నది.

( వాసవి - భగవంతంగుప్తా గారి వైశ్య సంబంధ శాసనములు)

తూర్పు చాళుక్యులకు తరువాత నాంధ్ర దేశమును బాలించిన. కాకతీయ చక్రవర్తుల కాలమందు గూడా నాంధ్రదేశ మందలి వైశ్యులు విదేశవ్యాపారము మునుపటివలె సాగించుచుండిరనుటకు గణపతిరుద్రుని కాలమందున్నూ, అతని కుమార్తెయగు రుద్రాంబకాలమందునూ చెక్కింపబడిన మోటుపల్లె శాసనములే ప్రబల సాక్ష్యములు. తరువాత కాలమందలి రెడ్డి రాజుల కాలమందలి ఆంధ్రదేశమందలి వైశ్యుల వ్యాపారోన్నతిని గురించి, శ్రీనాధుని "హరవిలాసము"ను కృతినందిన అవచి తిప్పయ్యశ్రేష్ఠియు, నతని సోదరు లిరువురును, వారి తండ్రియగు అవచి దేవయశ్రేష్ఠియు, తాతయగు అవచి పావాణిశ్రేష్ఠియు రెడ్డిరాజ్యమునకు పట్టుగొమ్మలై, సముద్రాంతర విదేశముల తోటి వాణిజ్యమొనర్చుచు రాజభాండారాధ్యక్షులై వైభవోపేతులై వర్థిల్లుచుండిరని చెప్పగల హరవిలాసాదిక సమకాలిక రచనలును, రెడ్డిరాజులనాటి యనేక శాసనములు చాటగలవు. ఈ యవచి వారు మాత్రమేగాక యితర వైశ్యవర్యులు గూడ ఆనాటి రాజులకడ భాండాగారాధ్యక్షులై, గొప్ప పలుకుబడిని గల్గి యుండిరనుటకు క్రీ.శ.1247 సంవత్సరపు నెల్లూరుజిల్లా రావూరుతాలూకా దేవవరము గ్రామ మందలి యొక శాసనమున పేర్కొనబడిన ఓవపాణి శ్రేష్ఠియు అదే నెల్లూరు జిల్లా కందుకూరి తాలూకా ముండి గ్రామ మందలి యొక శాసనమందు పేర్కొనబడిన కోనాసింగయ్య శ్రేష్ఠియు. వారివారి కాల మందలి రాజన్యులకడ నున్నత పదవు లందుండినట్లును, ఆయా నగరము లందలి వాణిజ్య సంస్థల కధినాయకులుగా నుండినట్లును, ఆశాసనముల వలన దెలియనగును ( శ్రీ.వి రంగాచారి గారిచే వ్రాయబడిన నెల్లూరుజిల్లా శాసనముల నెం. 667 -286)

ఆనాటి వణిక్ప్రవరులు, నాడు శ్రేష్ఠులు, నగర శ్రేష్ఠులు, నానాదేశ శ్రేష్ఠులు అను మూడు తెగలుండిరి. న్యగ్రోధజాతకమందు జానపదశ్రేష్ఠులని పేర్కొనబడిన వారే నాడు శ్రేష్ఠులయిరి. వీరు పల్లెపట్టులందలి వ్యాపారము నందు ప్రముఖ స్థానము వహించియుండిరి. నగరశ్రేష్ఠులు యీవాడు నగరమువారు, నగరత్తారులనబడు వైశ్యులవలె నగర ప్రాంతములందలి వాణిజ్య వ్యాపారములందు ప్రముఖులై ఆయా దేశ పాలకులగు నానాటి రాజులకు అప్పుపెట్టగల ధనాధికులై యుండిరి. అవచితిప్పయ్యశ్రేష్ఠి తండ్రియగు అవచి దేవయ్య శెట్టి.

శ్రీపర్వత సోపాన। స్థాపకుడగు రెడ్డి
వేమ జగతీపతికిన్।బ్రాపైన యవచి దేవయ

అని శ్రీనాధునిచే నతని హరవిలాస మందు స్తుతింపబడినాడు.ఇక నానాదేశ శ్రేష్ఠులన్ననో వారు విదేశవాణిజ్యమందు ప్రఖ్యాతిగాంచిన వారు. అవచి తిప్పయ్య, నతని తమ్ములును అన్ని దీవులతోటి బేహారము సాగించుచుండినవారు. క్రీ.శ. 1417 వ సం॥రపు సేలంజిల్లా శాసనమొకటి మహా ఓడవ్యాపారిగా ప్రఖ్యాతి గాంచిన

అన్నా ముతెల శ్రేష్ఠి అను నొక వైశ్యశ్రేష్ఠుని పేర్కొనుచున్నది. ( శ్రీ వి.రంగాచారిగారిచే వ్రాయబడిన సేలం జిల్లా శాసనము నెం.116 ) మొదటి రాజరాజ దేవచోళుని కాల మందలి చిత్తూరు జిల్లా శాసన మొండు పై మూడు తెగల శ్రేష్ఠులను బేర్కొనుచున్నది. వీరందరూ కలసి 1500 కుటుంబముల వారుండినట్లుగా తెలుపబడినది. ( శ్రీ వి. రంగాచారి గారిచే వ్రాయబడి చిత్తూరు జిల్లా శాసనము నెం.150) వారి యా నాటి వర్తక శ్రేణులు మధ్య కాలమందు గ్రీసు, ఇటలీ మున్నగు దేశములందు ప్రఖ్యాతి గాంచిన "మర్చంటుగైడ్సు" వంటివిగా మన దేశమందు పన్నెకెక్కియుండెను. ఆనాటి వర్తక శ్రేణుకు ప్రతి రూపములే నేటి "చాంబర్స్ ఆఫ్ కామర్స్" అను వ్యాపారముల సమిష్టి సంస్థలని చెప్పవచ్చును. బళ్ళారి జిల్లా శాసనమొండు ఈనానా దేశ తెగకు చెందిన వైశ్యుడగు మల్లేల కుమారాచలసెట్టిని బేర్కొనుచున్నది. (శ్రీవి.రంగాచారి గారిచే వ్రాయబడిన బళ్ళారిజిల్లా శాసనము నెం 232) క్రీ.శ1620 వ సం॥రము నాటి యొక చిత్తూరు జిల్లా శాసనమును, 1680 వ సం॥రపు అనంతపురం జిల్లా శాసనమును అయ్యావలీ పురాధీశుడగు పృధ్వీశెట్టి అను వర్తక ప్రముఖుని బేర్కొనుచున్నది. అతడు చిత్తూరు జిల్లా నారాయణవన మందలి కళ్యాణ వేంకటేశ్వరాలయమునకు క్రీ.శ1620 లోను, అనంతపురం జిల్లా లేపాక్షి యందలి ఈశ్వరాలయమునకు సరకుల మీద సుంకముల వచ్చు ఆదాయమును నానాదేశ వర్తకుల తరపున దానము గావించినట్లు తెలుపబడినది. ఈ పృధ్వీ శెట్టిని గూర్చి విపులముగా దెలియగోరువారు శ్రీ గురజాడ శ్రీరామమూర్తి. గారిచే రచింపబడిన రాయని భాస్కర చరిత్రమును పఠింతురు గాక! 1609 వ సంవత్సరపు నాటి యొక కర్నూలు జిల్లా శాసనమందు 150 మంది అరవీటినగరస్వాములను వాసవ కన్యకా రాధకులుగా పేర్కొనుచు వారివారి వర్తకశ్రేణి (మర్చంటు గైడు) ను గూర్చి కొన్ని వివరముల నిచ్చినది. ( శ్రీ వి. రంగాచారి గారిచే వ్రాయబడిన చిత్తూరు జిల్లా శాసనము నెం. 268, అనంతపురం జిల్లా శాసనము నెం.88, కర్నూలు జిల్లా శాసనము 581).

## సాంఘికాచారములు

తూర్పుచాళక్యుల కాలమందు ఆంధ్రదేశమున బౌద్ధ, జైనమతముల ప్రాబల్యమడుగంటి, వైదిక బ్రాహ్మణ మతము క్రమముగా ప్రధాన మతముగా నారంభమయ్యెను. వైదిక బ్రాహ్మణ మతము ప్రబలమగు కొలది, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదిక వర్ణ వ్యవస్థ తిరిగి ప్రబలస్థానమును వహించెను. అందు వలన జైనులు కూడా ప్రబలురైన వైదిక మతానుయాయుల మధ్య నిలువగలుగుటకు చాతుర్వర్ణవ్యవస్థను తమ సంఘములో పాటించ దొడగిరి. ఇందువలన, కులమందు మార్పు లేకుండ, వైదికమతము నుండి జైనమతమునకు, జైనమతము నుండి వైదికమతమునకు మారుట సుకరముగా నుండెను. అందు వలననే, ఆంధ్రబ్రాహ్మణులైన పంపకవి, పొన్నకవి జైనులు గాగలిగిరి. అటులనే ఆంధ్రదేశపు వైశ్యవర్ణజులైన రన్నకవియు, రేచన కవియుగూడ జైనమత ముందుండ గలిగిరి. ఇట్లు మతదురాభిమానములు లేనట్లే

భాషాదురాభిమానము గూడా ఆనాటి ఆంధ్రుల యందు లేకుండెను. అందువల్లనే జన్మతః ఆంధ్రులైననూ పంప,పొన్న, రన్నలు కన్నడ భాషయందు కావ్యములు వ్రాసిరి. జన్మతః కర్ణాటక దేశస్థుడైనను నారాయణభట్టు, నన్నయ భట్టున కాంధ్ర మహాభారత రచన యందు దోడ్పడెను.

పైని పేర్కొనబడిన రన్న, రేచనకవులు జైన వైశ్యులు. ఆంధ్రదేశీయులు. రన్నకవి కన్నడ భాషలో రత్నత్రయమని ప్రసిద్ధి బొందిన పంప, పొన్న, రన్నకవులందు కడపటి కవీంద్రుడు కన్నడభాషయందు అజితపురాణము, సాహస భీమవిజయము, రన్న కందము అను నిఘంటువును రచించెను.వేంగీదేశవాసి. తండ్రిపేరు జనవల్లభేంద్రుడు, అతని సోదరునిపేరు ధృఢబాహుచన మారయ్య ( భారతి ఏప్రిల్ 1965 తేదీ సంచిక 61-66పుటలు) రేచన కవీంద్రుడు మతమున జైనుడు. కులమున వైశ్యుడు. అతడు కవిజనాశ్రయమను, ఆంధ్రలక్షణ గ్రంథమును రచించినాడు. నన్నయ రచించిన ఆంధ్ర మహాభారతము తెలుగుభాషలో తొలిలక్ష్య గ్రంథమైతే, రేచన రచించిన కవిజనాశ్రయం ఆంధ్రభాషకు తొలిలక్షణగ్రంథం. ఈ కవిజనాశ్రయం "విష్ణుకుండిను"ల కాలమందలి జనాశ్రయఛందమునుబట్టి రచింపబడినది. (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటి 52 పొర్పులు 3-4, పేజీలు 34-42) ఈ రేచన కవీంద్రుడు కేవలము సాహిత్య విశారదుడే కాక, సంగ్రామ విశారదుడు కూడయై యుండెనని, అతని కవిజనాశ్రయములోని "ప్రహరణ కుశలుడు, అనతారి,అమిత సాహసుడు" అనే పదాలు చాటగలవు (సమగ్రాంధ్ర సాహిత్యం1, ఆరుద్ర పుటలు 223-224) .

ఇట్టి సాహితీ సంపన్నులగుటకు ఆనాటి వైశ్యులకు గురుకులాశ్రమ విద్యా సౌకర్యము లుండిన విష్ణువర్ధన రాజేంద్రుడు పెనుగొండ నగరమునకు మొదట వచ్చిన పుడు నగర ప్రవేశాత్పూరము, తత్పుర ప్రాంతమున చూచినదొక వనము ఆ వన మందుండు వివిధ ఫలపుష్ప వృక్షజాతులనే గాక క్వచిద్వట జనాః పత్రకావ్యాలంకార పాఠకః ఆలోకయన్॥ అనగా పత్రపుష్ప ఫలార్థమై వచ్చిన వటువులను, వేద శాస్త్రాదుల వ్యాఖ్యా నించు వారిని, అక్షరాభ్యాసకులను, గణిత శాస్త్రాసక్తిగల వారిని, వ్యాకరణ కావ్యా లంకారాది శాస్త్రపాఠ కులను ఆశ్చర్యముతో చూచెను. అనగా అనాడు పెనుగొండ నగరమున కానుకొని వనమున నాయూరి వైశ్యులకు సకల విద్యలను నేర్పుచున్న గురు కులాశ్రమ పద్ధతిలో సాగుచున్న పాఠశాల యొకటి నుండెనని గ్రహింపవలసియున్నది. ఈనాడు పాశ్చాత్య పద్ధతులందు జరుగు కుహనా విద్యా వ్యామోహములోబడి చెడిపోవుచున్న యువతీ యువకులకు ముఖ్యముగా మన వైశ్యసంఘమందలి యువతీయువ కులకు అట్టి విద్యాసంస్థ యొకటి ఆ పెనుగొండ పురప్రాంతముననే ఆనాటి పురాణగాధకు స్మృతి చిహ్నముగా నారంభింప వలయునని వైశ్యసంఘీయులకు ముఖ్యముగా పెనుగొండ నగర వైశ్యులకు నా మనవి. వారట్టి సంస్థ నెలకొల్ప పూనుకొన్నచో యీ వాసవకన్యకా పురాణమును వాదోపాద్ఘాతాదిక రచయిత తన జీవితశేషమును ఆ సంస్థాసేవకు అంకితమొనర్ప సన్నద్ధుడుగా నున్నాడని మనవిచేసుకొనుచున్నాడు. .

(ఇంకావుంది)

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల

73-ఎ. శాంతోమ్ హైరోడ్, మద్రాసు - 600 028.
ఫోన్ : 4942074, 4941973



## విజ్ఞప్తి

అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉదహరించిన ప్రకారము తీర్మానించారు.

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే. పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడును. ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును. సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను. ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను. మరొకరికి వ్రాసి పంపకూడదు. ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను. అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాలో తగ్గించ బడును. మైనరు దాతలు అంగీకరింపబడరు. ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును. తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి.డి.లు వారికి వాపసు పంపబడును. పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను.

డి.డి.లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను. అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను. వారికి బదులు యితరులు చేసిన చెల్లదు. విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగా చేయబడదు. రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు.

ఇట్లు
దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

**ఆర్.ఆర్.నాధం**
మేనేజింగ్ ట్రస్టీ

## శ్రీ దోమావారి సాహిత్య వైభవమును విపులంగా తెలిపినారు

పూజ్య మిత్రులు శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారికి అనంత శుభోదయములు.........

బ్రహ్మీభూతులు శ్రీ దోమా వెంకట స్వామి గుప్తగారి సాహిత్య సేవను గురించి పదిపేజీల వ్యాసం అద్భుతంగా వ్రాశారు. శ్రీ దోమా గుప్తగారి సాహిత్య వైభవమును విపులముగా తెలిపినారు.

పద్య విద్యను గురించి మీకింత గొప్ప పరిచయము కలదని పూర్వము నేను అనుకోలేదు. పద్య కావ్యములను మీరు బాగా పఠించి పరిశీలించి యున్నట్లు తెలియుచున్నది. చిన్నపుడు నేను తెలుగు కావ్యములను బాగా పఠించేవాణ్ణి. ఈ మధ్య ఆ అలవాటు తప్పిపోయినది.

1924 ప్రాంతములో శ్రీ గుప్తగారి ఆశు కవిత్వ ప్రదర్శనములలో రెండు పర్యాయములు పాల్గొన్నాను. అప్పటి నా వయస్సు 20 సంవత్సరములు. నెల్లూరులో శ్రీ గుప్తగారికి ఘన సన్మానము చేయ వలెనని 1942లోనే శ్రీ కోట వెంకటరంగం గుప్తగారి ఆధ్వర్యములో గొప్ప కృషి జరిగినది. ఆ కమిటీ వారితో నేనుగూడ తిరిగినాను. ఆ కృషి కార్యరూపము ధరించలేదు. నేను విద్వాన్ పరీక్షలు చదువు చున్నపుడు శ్రీ గుప్తగారు నన్ను ఆశీర్వదించి యుండిరి. ఆ మహాత్ముని పేరుతో మీరు సాహిత్య పీఠమును స్థాపించి ఎనలేని సేవను చేయుచున్నారు.

మాతృశ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి మీకు ఈప్సితార్థములను ప్రసాదించవలెనని ప్రార్థించు చున్నాను.

ప్రేమతో
గర్రె సత్యనారాయణ గుప్త
అధ్యక్షులు
ప్రార్థనా గాన సంఘము
విజయవాడ. 11-6-97

## అట్టి వ్యక్తులు కరువైనారు

గౌరవనీయులు, వైశ్యకులోద్ధారకులు, సమాజ శ్రేయోభిలాషులు, శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారికి గాయత్రీ స్వామి పరమాత్మ స్మరణము.

నాయనా! తమ పత్రికలను చూస్తూ ఉంటాను. మీ యొక్క భావాలు అర్థం చేసుకుంటాను. కానీ ప్రస్తుత సమాజంలో ఏ వైశ్య సమాజంలో కానీ ఇటువంటి మౌళికమైన భావాలు కానీ, ఆలోచనలు కానీ, అట్టి వ్యక్తులు కానీ కరువైనారు. అలాంటి హృదయముతోనే ఉంటూ ఉండే వాళ్ళలోనేనూ ఒకడిని. ప్రస్తుతం వ్రాయునది - జూన్ పత్రికలో ఆత్మూరి వారిని గురించి, తమరు ప్రచురించిన వ్యాసము బాగుంది. నాది ఒక కోరిక మామిడీ వారి, ఆత్మూరి వారి జీవిత చరిత్రలు సమగ్రంగా ఉన్న గ్రంధాలు విడుదల అయినవా? విడుదల అయిన ఎక్కడ లభించును? మీరు ప్రింటు చేసిన నావంతు బాధ్యతగా కొంత సహాయము చేయగలను. వెంటనే క్షేమ సమాచారములు వ్రాయించగలరు.

శుభం భూయత్
గాయత్రిస్వామి
ఇంటినెం. 25, బైరాగి పట్టెడ
తిరుపతి. 21-6-97.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 603. కడప జిల్లా.**

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును.

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 x 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును. వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

# ఈ నెలలో మీ కర్తవ్యము

( 21.7.1997 నుండీ 20.8.1997 వరకు)

మీరు పంపవలసిన A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి పంపుటకు ఆగస్టు నెల 20 వ తేదియే చివరిది. మీరు పంపు ఆ రిటర్నును చెక్కుతో బాటు పంపాలను కుంటున్నారా? ఆ విధంగా A-2 రిటర్నును చెక్కుతో బాటు పంపుటను ఆగస్టునెల 15వ తేదీలోగా చేయాలి.

పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1997 జూన్ నెలలో చెల్లించిన జీతములు ఆ జీతములలో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంట్ ఫారము నెం 21ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ (జూలై) నెల 31వ తేదీలోగా చేర్చాలి.

1997 జూన్ నెల జీతములో పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ (జూలై) 31వ తేదీలోగా చేర్చాలి.

## కాచిగూడ వైశ్య హాస్టల్‌కు నూతన కార్యవర్గము

ఈ క్రిందివారు పై వైశ్య హాస్టల్‌కు 1997-99 సంవత్సరాలకు నూతన కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు. అధ్యక్షులు శ్రీ షల్లా సోమరాజ్‌రామ్, ఉపాధ్యక్షులు శ్రీ సముద్రాల చంద్రయ్య, బూరుగు సూర్య ప్రకాశరావు, ప్రధాన కార్యదర్శి శ్రీ కొత్తూరు జయప్రకాశ్, కోశాధికారి శ్రీ వేలూరు రవీంద్రనాథ గుప్త.

## శ్రీ యం.వి.వి.చలం గారికి భీమరధ శాంతి

అనంతపురం జిల్లా హిందూపురం పురపాలక సంఘం మాజీ అధ్యక్షులు శ్రీ యం.వి.వి. చలం గారి భీమరథ శాంతి మహోత్సవం 12-6-1997 నుండీ 14-6-1997 వరకూ అత్యంత వైభవంగా జరిగింది. 12-6-1997వ తేదీన ప్రారంభమైన యీ శాంతి కార్యక్రమము త్రయాహ్నిక దీక్షతో సాగి 14-6-1997 మధ్యాహ్నం 12 గంటలకు జరిగిన సంప్రోక్షణ కార్యక్రమముతో ముగిసింది. ఒక వ్యక్తి తన 70వ ఏట జరుపుకొనే శాంతిని భీమరధ శాంతి అంటారు.

